రామ— గీ. మున్ను జిరకాల మెందు గాపుర మొనర్చి
వన్య గృహమేధులము ధర్మ పరుల మగుచు
నేము సంసార సుఖరసం బెఱిఁగినార
మట్టి వన మివ్వు డీక్షింప నయ్యె మరల. 21.

గీ. మొరయు నెమిళుల నొప్పు భూధరము లవియె!
సమద హరిణంబు లగు వనస్థలము లవియె!
మంజు వంజుల లతికా సమంచితములు
తరుణ నీప నిచుళ సరిత్తటము లవియె! 22.

క. జలధర మాలికవలె ద
ట్టలకుం బ్రస్రవణ దివ్య భూధర మదియే
తెలియుంబడు; గోదావరి
యొలమిం బ్రవహించు నచటనే నిర్మలయై. 23.

చ. ఈరు వగు దీని శృంగమున నుండె జటాయువు; దాని క్రింద ను
స్థిరముగఁ బర్ణశాలల వసించితి మేమును; గౌతమీ పయ
స్ఫురిత వినీల రుగ్వితత భూరుహ శోభఁ దనర్చి పక్షిన
ద్విరుతములన్ ధ్వనించు వనవీథుల బంధురమైన సీమలన్. 24.

ఇచ్చటనే పంచవటి. ఇందుఁ జిరకాల ముండుటం బట్టి యీ ప్రదేశంబు లన్నియు వివిధ విస్రంభ విహారములకు సాక్షులై యున్నయవి. ప్రియురాలి ప్రాణసఖి వాసంతియు నిచ్చటఁ గలదు. కాన నివ్వుడీ రామహతకున కేమి కానున్నదో! ఇప్పుడు—

---

గృహమేధులము=గృహస్థులము.

మంజు= మృదువైన, వంజుల లతికా= ప్రబ్బలితీగలచే, సమంచితము= ఒప్పినవియు, తరుణ=లేఁతవగు, నీప=కడిమిచెట్లును, నిచుళ=ఎట్టిగన్నేరుచెట్లునుగలిగిన సరిత్తటములు=ప్రవాహపుటొడ్లు. అవియే.

జలధరము= మేఘము. గౌతమి=గోదావరియొక్క, పయః=నీటిచేత, స్ఫురిత= కదల్పఁబడిన, వినీల=మిక్కిలినల్లనగు, రుక్=కాంతిగలిగిన, వితత=విశాలమగు, భూరుహ=వృక్షములయొక్క, శోభఁదనర్చి, పక్షివత్=పక్షులయొక్క, విరుతములన్=కూతలచే, విస్రంభ=ప్రణయసంబంధమగు.

మ. ఘన కాలంబునకుఁ బెయి న్విరిసి తీక్ష్ణంబౌ విషం బట్లు, నూ
తన సంఘాతమునం జలించు వికటోద్య చ్ఛల్యా ఖండంబు నా
గను, హృన్మర్మమునం బ్రభిన్న మగు నా గ్రంధివ్రణం బట్లు, ప్రా
క్తన శోకంబు నవీనమై మరల న గ్గారించునుద్వేలతన్. 25

అట్లయినను బూర్వ పరిచితంబు లగు నీ భూభాగంబులం గనుంగొందును. (పరికించి) ఓహో! ధరణీసంస్థాన మెంత విపర్యస్తమైనది.

మ. తొలుతన్ వెల్లువయేడనో పులిన మందుం దోఁచె నివ్వాగులం,
దలవృక్షంబుల సాంద్రతా విరళతల్ వ్యత్యాసముం జెందె, నిం
దలి కానం జిరకాలమై కనుట నన్యం బట్లు గాన్పించె, ని
శ్చల శైలంబులచే నదే యనని సాక్షా న్నిశ్చయం బయ్యెడిన్. 26.

అన్నా! పరిత్యజించు చున్నను న న్నీ పంచవటీ స్నేహము బలవంతముగా నాకర్షించు నట్లున్నది. (దైన్యముతో)

చ. అల సతిఁ గూడి యే నెచట నాదినముల్ సుఖియించినాఁడ, మ
న్నిలయమునం దజస్రము యదీయకథల్ వితతంబు లయ్యెఁ, దొ
య్యలి నెడఁబాసి యొంటియగు నా దురితాత్ముఁడు రాముఁ డిప్పు డ
గ్గల మగు నట్టి పంచవటిఁ గాంచు నెటుల్? గనకేగు నెట్టులన్. 27.

శంబు— (ప్రవేశించి) దేవర జయించుఁగాక! దేవా! భగవానుఁ డగు నగస్త్యమౌని నావలనఁ దమ సన్నిధానము ను విని, "వత్సల యగు లోపాముద్రయు నగస్త్యాశ్రమ వాసు లందఱును విమానావతరణ మంగళం బాయత్త పఱచి నీకై నిరీక్షించియుండిరి. కాన విచ్చేసి మమ్ము మన్నింపుము. పిమ్మట జవనపుష్పకంబున స్వదేశమున కరిగి యశ్వమేధమునకు సన్నద్ధుండ వగుదువు" అని మీకాన తిచ్చె.

రామ—భగవదాజ్ఞ నిర్వర్తింతును.

శంబు—అట్లయిన దేవర పుష్పకము నిట్లు మరలించుఁగాక!

---

సంఘాతమునన్=దెబ్బచేత, చలించు=కదలు, వికట=వ్యత్యస్తమయిన, ఉద్యత్=అతిశయమయిన, శల్యఖండంబు=బాణముయొక్క తునుక. ప్రాక్తన=పురాతనమైన, ఉద్వేలతన్=అగ్గలమయి. గ్రంధివ్రణము=కంతివలెకఠినమైనవ్రణము.

వెల్లువ=ప్రవాహము, పులినము=ఇసుకతిన్నె. సాంద్రతావిరళతల్=దట్టము పలుచన. అజస్రము=ఎల్లప్పుడు, యదీయ=దేనిసంబంధమైన, వితతంబులు=వ్యాప్తములు

రామ—భగవతీ ! పంచవటీ ! శిష్టజనానుసరణంబున నిన్ను రాముఁడు క్షణమాత్ర మతిక్రమించుచుండె. సైరింపుము!

శంబు—దేవా ! చూడుము చూడుము !

మ. అల కుంజంబుల ఘూక ఘూత్కృతులు మెండౌ కీచకస్వానముల్
వోలయం గిమ్మనకుండ వాయసములం బోల్పారెఁ గ్రౌంచావతం;
బెలమిం గేరు నెమిళ్ల కేకలకు నెంతే జంకి వ్యాళంబు ల
గ్గలికం జుట్టెఁ బురాణ చందన తరు స్కంధంబులం దిగ్గిరిన్. 28

మ. అలవే ! దక్షిణ భూధరంబు లధిరూఢాంభోధరోద్యత్ప్రభా
కులశృంగంబులు; గందరోద్ధత నద ద్గోదావరీ తోయముల్,
కలితాన్యోన్య విఘాత సంకుల చల త్కల్లోల కోలాహలం
బు లివే ! భీమ గభీర వారి ఝరముల్ ; పుణ్యాపగా సంగముల్. 29

(అందఱు నిష్క్రమింతురు)

పంచవటీప్రవేశమను
ద్వితీయాంకము,
సంపూర్ణము.



---

కుంజంబులు=పొదరిండ్లు, ఘూక=గుడ్లగూబలయొక్క, ఘూత్కృతులు=ధ్వనులు, కీచకస్వానముల్ = బొంగు వెదుళ్ళధ్వనులు. వాయసములు=కాకులు, కేరు = సంతోషించు, వ్యాళములు = పాములు, స్కంధము = ప్రాను.

అధిరూఢ = అధిష్ఠించిన, అంభోధర = మేఘములయొక్క, ఉద్యత్ = అతిశయమాన, ప్రభా = కాంతిచేతను, ఆకుల = కూడుకొనిన, శృంగంబులు = శిఖరములు. కందర = గుహలనుండి, ఉద్ధత = బయలువెడలిన, నదత్=ధ్వనిచేయుచున్న, గోదావరియొక్క, తోయముల్=ఉదకములు కలిత=కూడుకొనిన, అన్యోన్య=పరస్పరమగు, విఘాత = తాకుడులచేత, సంకుల = వ్యాప్తమై, చలత్ = కదలుచున్న, కల్లోల = తరంగములయొక్క, కోలాహలంబులు = కలకలధ్వనులు, భీమ = భయంకరమైన, గభీర = లోతయిన, వారి = ఉదకముయొక్క, ఝరముల్ = ప్రవాహములు; పుణ్యా = పవిత్రమయిన, ఆపగా = నదులయొక్క, సంగముల్ = కలయికలు.



# ఆంధ్రీకృతోత్తర రామచరిత్రము.

## తృతీయాంకము.

(తమస, మురళ, అను నదీద్వయము ప్రవేశించును.)

తమ—సఖీ! మురళా! తొందర గలదానివలె నుంటివేమి?

ముర—భగవతీ! తమసా! తరంగిణీమణి యగు గోదావరి కెఱింగింప నగస్త్యభగవానుని సధర్మిణియగు లోపాముద్రచే నంపఁబడితిని. "ఎఱుఁగుదువుగదా! సతీపరిత్యాగము మొదలు."

క. వెలువడ నట్టి గభీరత
వలనన్ మది డాగియున్న బహుళవ్యధచేఁ
గలఁగి పుటపాకగతి రా
జిలు రాముని కరుణ రసము జృంభిత మగుచున్. 1.

అట్టి యిష్టజనముం గష్టముల పాలుజేయుటం బట్టి ఘనీభవించిన దీర్ఘశోకమున నిపుడు రామభద్రుండు మిగులఁ బరిక్షీణుఁ డయ్యె. వానిఁ గాంచి నా నెమ్మనం బురియాడు చున్నట్లున్నది. ఇప్పుడు మరలి పోవు రామభద్రుండు పంచవటీ వనంబునఁ బ్రియా సహవిహార సాక్షులగు రమ్యప్రదేశములం దెప్పుడు చూడఁ గలఁడు. అందు స్వభావ ధీరుండైనను రామభద్రున కిట్టి యవస్థ యందతి విపుల శోకావేగ సంక్షోభంబున నడుగడుగున మహాప్రమాదంబు లూహింపఁ దగి యుండును. కాన భగవతీ! గోదావరీ! నీవు జాగరూకురాలవై యుండ వలయు.

---

జృంభితము=విస్తారము,

గీ. జలజ కేసర సురభులై జల లవముల
మలపు శీతల వీచికా మారుతములఁ
గొల్లలుగఁ జల్లి పెల్లు మూర్ఛిల్లు వేళ
రామభద్రుని జీవంబు నోము'' మనుచు. 2

తమ—యుక్తమే స్నేహమునకుఁ బ్రియజనాను వర్తనము. జీవనోపాయము మాత్రము ముఖ్యమయినదే యిపుడు తారసిల్లినది.

ముర—ఏమది ?

తమ—వినుము. తొల్లి వాల్మీకి తపోవన ప్రాంతమునఁ బరిత్యజించి లక్ష్మణుం డరుగ జానకీదేవి ప్రసవ వేదనాక్రాంత మగు దేహమును ప్రబల దుఃఖోద్వేగమున గంగా ఘురంబునం దర్పించె. అం దప్పుడే డింభక యుగ్మంబునుం గని భగవతు లగు ధరణీ భాగీరథులచే ననుగృహీతయై రసాతలంబునం జేర్పఁబడియె. పిదప జాహ్నవీదేవి స్తన్యత్యాగ ప్రాయమున నా డింభక ద్వయమును వాల్మీకిమునికిఁ దనయంత నర్పించినది.

ముర—(ఆశ్చర్యముతో)

క. ఏయెడ నీదృశ జనము స
హాయం బొనరించు నట్టి యనఘాత్ముల కా
నాయత దుర్దశయైనం
జేయుం బరమాద్భుతంబు జింతింపంగన్. 3.

తమ—ఇప్పు డీ శంబూకవృత్తాంతంబున జనస్థాన సమాగతుం డగు రామభద్రుని సరయూముఖంబున విని భగవతి యగు భాగీరథియుఁ బ్రేమమున లోపాముద్ర తెలంగునని యూహించి సీతాసమేతయై యెద్దియో గృహాచార మిషంబున గోదావరిం జూడ నరుగుదెంచె.

ముర—''రాజధానియం దుండి జగదభ్యుదయ బీజంబు లగు దత్త ప్రయోజనంబులం బ్రవర్తించు రామభద్రునకు వినోదంబు లేర్పడి యుండును. నిర్వ్యాపారుఁడై శోకమాత్ర సహాయుఁడైన వీనికిఁ బంచవటీ ప్రవేశము మహానర్థ'' మని భగవతి

---

జలజ=పద్మములయందలి, కేసర=కింజల్కములచే, సురభులై=పరిమళించునవియై, జలలవముల=నీటితుంపురులను, మలపు=మరలించు. డింభకయుగ్మము=ఇద్దఱు బిల్లలు. రసాతలమున=పాతాళమున, సమాగతుండగు=వచ్చిన.

లెస్సగా యోజించినది. కాని యిపుడు జానకీదేవిచే రామభద్రుఁడెట్లాదరింపఁబడును ?

తమ—ఇట్లు భగవతి భాగీరథి పల్కినది. "వత్సా ! యజ్ఞభూనందినీ ! సీతా ! ఇప్పుడాయుష్మంతులగు కుశ లవులకు ద్వాదశ వర్ష సంఖ్యా బోధకం బగు మంగళ గ్రంధిని బంధింపఁబడును గాన నీపురాతన శ్వశురుండు, నిందనుకం గల మానవ రాజర్షి వంశమున కుత్పాదకుండును, గలుష సంహారకుండు నగు దేవుని భానుమంతుని స్వహస్తాపచితంబు లగు ప్రసూనంబుల నారాధింపుము. ధరణీతల చారిణి వగు నిన్ను మా ప్రభావంబున వనదేవతలు సయితముఁ గనుంగొనఁ జాలరు. మర్త్యులం బల్కనేల" ? అని మఱియు, "తమసా ! వధు వగు వత్స జానకి నీయెడలఁ బరమ ప్రేమ గలది. కాన నీవే దానికి సహచారిణివి గ"మ్మని నాకాన తిచ్చె. ఇప్పుడామె యాజ్ఞ ననుసరింతును.

ముర—నేనీ వృత్తాంతమును లోపాముద్రతో నివేదింతును. రామభద్రుండు నేతెంచె నని యే తలంతును.

తమ—ఇదే ! గోదావరీ హ్రదంబునం బయలుదేరి—

గీ. ఎల్లెడల వెల్లనై చిక్కి గల్లములును,
జెదరు కురులను బొదలాడు వదన మొదవఁ,
గరుణ మూర్తియొ ? మెయిదాల్చు విరహభరమొ ?
నాగ జనకేంద్ర పుత్త్రి కాననముఁ జేరె. 4.

ముర—ఇదిగో !

చ. హృదయకుసుమంబు వాడునటు లేచెడు దారుణ దీర్ఘ శోక మిం
పొదవెడు వృంతమం దొలఁగి యున్న ప్రవాళముఁ బోలె నెండి వె
ల్లదనము నొందు దీని మెయి గ్లాని వహింపఁగఁ జేయుచుండె, భం[illegible]
గద మగు శారదోష్మమిల కైతక గర్భ దళంబు పోలికన్. 5.

(పరిక్రమించి నిష్క్రమించిరి.)

విష్కంభము.

---

పురాతనశ్వశురుండు=వృద్ధుఁడగుమామ, ఉత్పాదకుఁడు=కారణభూతుఁడు. భానుమంతుని= సూర్యుని, అపచితంబులగు= కోయఁబడిన, వసువు=కోడలు, నివేదింతును=చెప్పెదను, గల్లములు=చెక్కిళ్లు, గ్లాని=కృశత్వము, శారదోష్మము= శరత్కాలపు వేఁడిమి, కైతకగర్భదళము=మొగలిపొత్తిలోనిరేకు. ప్రవాళము=చిగురు

(తెఱలో) “ప్రమాదము ప్రమాదము.

పుష్పములఁ గోయుచుఁ గరు జౌత్సుక్యములతో వినుచు సీత ప్రవేశించును

సీత—ఓహో ! యెఱుంగుదును. నా ప్రియసఖి వాసంతి పలుకు-చున్నది.

(మరలఁ దెఱలో)

వ. “అవనిజ సల్లకీ కిసలయంబులఁ గేల నొసంగ లాలితం
జవిగొని ప్రోల నే ద్విరద శాబము మున్ను ప్రవృద్ధిఁ జెందెనో”?

సీత—దానికేమి?—

(మరలఁ దెఱలో)

“కవగొని కాంతతోడ జలకంబు లొనర్చుచు నుండ దాని బల్
జవమున నొక్క కుంజర లలామ మెదుర్కొనెఁ జెంత నుద్ధతిన్. 6

సీత—(తొందరతోఁ గొన్ని యడుగులు నడిచి) ఆర్యపుత్రా ! నాపుత్త్రకుని రక్షింపు రక్షింపు. (స్మృతినభినయించి దైన్యముతో) కటకటా ! చిరపరిచితంబులగు నయ్యక్షరంబులే పంచవటీ దర్శనంబుచే . మరల మందభాగ్యురాల నగు నన్ననుసరించుచున్నవి.—హా ! ఆర్యపుత్రా ! —(మూర్ఛిల్లును.)

తమస—(ప్రవేశించి) వత్సా ! ఊరడిల్లు మూరడిల్లుము.

(తెఱలో) “విమాన రాజమా ! యిచ్చటనే నిల్వుము.”

సీత—(ఊరడిల్లి భయోల్లాసములతో) ఓహో! జలభర వలాహక రణిత గంభీర క్షీవరం బైన యీ భారతీ నినాద మెచ్చటిది ! (శ్రవణ వివరంబులం జొచ్చి) మందభాగ్యురాల నగు నన్ను గూడ గొబ్బున నూరడించుచున్నది.

తమ—(స్నేహ బాష్పములతో) ఓవత్సా !

క. ఎచ్చటి నుండియొ కలరూ
పచ్చుసడక వచ్చు నినద మందున నిట్టే
వెచ్చగు గర్జకు నెమ్మిలి
మచ్చున నౌత్సుక్య భీతి మరగెద వేమే ?

---

ఔత్సుక్యము = సంతోషము, సల్లకీకిసలయంబుల = అందుగుచిగుళ్ళను, లాలితన్ = ఆపచే, ద్విరదశాబము = పిల్లయేనుఁగు, కుంజరలలామము = శ్రేష్ఠమైనయేనుఁగు, జలభర = నీటితో నిండిన, వలాహక = మేఘము వలె, రణిత = ధ్వని చేయుచున్న గంభీరమైన— క్షీవరం బైన = బలిసిన్న, భారతీనినాదము = వాగ్ధ్వని, గర్జకు నెమ్మిలి మచ్చున = ఉఱుము వినిన నెమలివలె,

సీత—భగవతీ ! అస్పటం బనెద వేమి ? ఈ స్వరశైలి నే నెఱుంగుదును. ఆర్యపుత్త్రుఁడె పలుకుచున్నాఁడు.

తమ—"తపస్వి యగు శూద్రుని దండింప నైక్ష్వాకభూపతి జనస్థానమున కేతెంచె" నని వింటిని.

సీత—సంతోషము ! ఆరాజు రాజధర్మముం బరిత్యజింప లేదుగదా !

(తెఱలో)

ఉ. "ఏ వలనన్ మృగద్రుమము లెల్లను నాహిత బంధు వర్గమా ?
నే వలనం బ్రియం గలిసి యేండ్లకొలంది వసించినాడ ? నా
నావిధ నిర్ఝరంబులఁ గనుంగొని, కందర రాజి నొప్పి, గో
దావరిపొంత నున్న వసుధాధర రమ్య తటంబు లివ్వియే ! 3

సీత—హా ! యెట్లు ప్రత్యూషేందు మండలంబుపాండురంబై పరిక్షీణ దుర్బలం బగునాకారంబు గల్గి గంభీర ప్రభావ మాత్రంబుచేఁ బ్రత్యభిజ్ఞాతుఁ డగు నార్యపుత్త్రుఁడే; కాన నన్నాదుకొనుము. (తమసం గౌఁగిలించి మూర్ఛిల్లును)

తమ—(పట్టుకొనుచు) వత్సా ! ఊరడిల్లు మూరడిల్లుము.

(తెఱలో) "ఈ పంచవటీ దర్శనంబున—

గీ. హృత్తలంబున లీనమై యిప్పుడు ప్రబల
మగుచు జ్వలియింపఁ బోవు దుఃఖాగ్ని నొదుపు
ధూమ విసరంబు వోలె నుద్దామభంగి
నావరించుచు నుండె మోహంబు నన్ను. 9

హా ! ప్రేయసీ ! జానకీ !

తమ—(తనలో) ఇదియే గురుజనం బూహించినది.

సీత—(ఊరడిల్లి) హా ! యెట్లిది

(తెఱలో) "హా ! దేవి ! దండకారణ్యా వాస ప్రియసఖి! విదేహరాజపుత్త్రి!"

(మూర్ఛిల్లును.)

---

ఏవలనన్ = ఎచ్చట, మృగద్రుమములు = మృగములు, చెట్లు, ఆహితబంధువర్గమా = బంధుసముదాయముగాఁ జేయఁబడెనో ? నిర్ఝరంబులన్ = ప్రవాహములను, కందరరాజిన్ = గుహాసముదాయముచే, ప్రత్యూష = ప్రాతఃకాలమందయిన, ఇందుమండలము = చంద్రబింబము, అపాండురంబయి = తెల్లబడి, ఒదుపు = క్రమ్ము.

సీత—ఇస్సీ! మందభాగ్య నగు నన్నుచ్చరించి నిమీలిత నేత్రోత్పలుండై యార్యపుత్త్రుండు మూర్ఛిల్లె. హా! యెట్లు! భూతలంబున నుత్సాహంబు దక్కి దుస్సహంబుగా నొరగి పడియె. భగవతీ! తమసా! రక్షింపు రక్షింపు. ఆర్యపుత్త్రుని బ్రదికింపుము.

(పాదముల నొరఁగును.)

తమ— క. బ్రతికింపుము నీవె జగ
త్పతి నో కల్యాణి! నీదుపాణితలంబే
హితసంస్పర్శం బగు; జీ
విత లాభము గల్గు దాన వినియత భంగిన్. 10

సీత—ఏమయిన నగుఁ గాక! భగవతి పల్కినట్లే చేయుదును.

(తొందరతో నిష్క్రమించును.)

(పిదప భూపతితుఁడై సబాష్పయగు సీతచే స్పృశింపఁబడి సంతోషధైర్యములతో, రాముఁడు ప్రవేశించును)

సీత—(సంతోషముతోఁ దనలో) త్రైలోక్య నాథుని జీవితము మరల వచ్చినది.

రామ—ఓహో! యేమిది?

చ. వర హరిచందనాభినవ పల్లవ జాత రస ప్రలేపమో?
సురుచిర పీడితేందుకర సుందర కందల సారసేకమో?
ఖరతర తప్త జీవిత నగంబునకుం బరితృప్తి గల్గ భా
స్వర పరజీవనౌషధి రసంబు మదాత్మ నిషిక్తమయ్యెనో? 11

గీ. సత్య మా పూర్వపరిచిత స్పర్శ మిదియొ,
చిత్త పరిమోహణంబు, సంజీవనంబు,
ప్రబల సంతాప జనిత మూర్ఛ నిపుడడఁచి,
మరల నానంద వివశత్వ మురువడించె. 12.

సీత—(భయ దైన్యములతో నించుక వెనుక తగ్గి) ఇప్పుడు నా కింత మాత్రమే మహాతరము.

నిమీలిత=మూసికొనిన, పీడిత=పిండఁబడిన, కందల=మొలక, సేకము=చల్లుట, ఖరతర=మిక్కిలి తీవ్రముగా, నగంబు=చెట్టు, నిషిక్తమయ్యెనో=చల్లఁబడెనో.

రామ—(కూర్చుండి) వత్సల యగు జానకీదేవిచే ననుగ్రహింపఁ బడుదుఁగదా?

సీత—కటకటా! ఆర్యపుత్త్రుండు న న్నెల వెదకుచుండెను?

రామ—ఔఁగాక! పరికింతును.

సీత—భగవతీ! తమసా! మరలిపోవుదము. నన్ను జూచుచో నిరనుమతి—సాన్ని
ధ్యంబున మహారాజు నాయందు మిగుల నాగ్రహింపఁగలఁడు.

తమ—ఓవత్సా! భాగీరథీప్రభావంబున వనదేవతలకు సైత మదృశ్యురాల వైతివి.

సీత—ఔను, కలదిది. (...)

రామ—ప్రియసీ! జానకీ! (...)

సీత—(దైన్య గద్గదస్వరముతో) ఆర్యపుత్త్రా! యీ వృత్తాంతమునకుఁ దగన మస
మంజసము గదా! (కన్నీళ్ళతో) మందభాగ్యురాల నగు నన్నిట్లు వాత్సల్యంబు
తోఁ బిలుచు జన్మాంతర సంభావిత దుర్లభ దర్శనుం డగు నార్యపుత్త్రునియందు
దయలేక వజ్రమయురాల నెట్లగుదును? నా (హృదయ) మెంతయు నితని హృదయ
మేను నెఱుంగుదును.

రామ—(కలయఁ జూచి నిర్వేదముతో) హా! యెట్లు? ఇచ్చట నెవ్వరును లేరు.

సీత—భగవతీ! తమసా! అట్లు నిర్హేతుకంబుగాఁ బరిత్యజించినను నీని యిట్టి సంద
ర్శనంబున నాహృదయానుబంధ మెట్టిదో నే నెఱుంగఁ జాల(నైతివి.)—

తమ—ఎఱుంగుదును వత్సా! యెఱుంగుదును.

శా. ఆలోచింపఁ దటస్థమై, యుపకృతి ప్రాప్తిన్ రుషాబద్ధమై,
గ్లానిన్ దీర్ఘవియోగ మొందియు, హఠాత్ త్రైక్య సంతుష్టమై,
ధీసౌమ్యత్వమునం బ్రసన్న మయి, భర్తృక్లాంతి విక్లాంతమై, 13.
వాసిం బ్రేమ కరంగిన ట్లెసఁగె నీ స్వాంతంబు దా నెంతలోన్.

రామ—దేవి!

గీ. స్నేహ రస శీతలం బగు నీదు స్పర్శ
తనువు దాల్చిన సుప్రసాదంబు వోలె
మించి నన్నిప్పటికిని జొక్కించుచుండె
ముదితరో యెందు నీవు కన్మఱగినావు? 14.

---

రుషా=రోషము. భర్తృక్లాంతివిక్లాంతమై = భర్తయొక్క విచారమువలన ఖేదము నందుచున్నదై.

సీత—సాకల్యసందర్శిత ప్రేమానుబంధంబులై యానందంబుఁ జెందు నీ యార్యపుత్త్ర సల్లాపములు వినుచుంటిని. ఇందలి విశ్వాసంబున నిర్హేతుక పరిత్యాగ పీడితంబై నను నా జననంబు బహూకృతం బైనది.

రామ—ఎక్కడి ప్రేయసి? ఇది నిక్కముగ రామభద్రునకు వృత్తిపరంపరా సంపాదితం బగు కేవల భ్రాంతి.

(తెఱలో) "ప్రమాదము. ప్రమాదము."

చ. అవనిజ సల్లకీ కిసలయంబుల—(పూర్వార్ధము వినఁబడును.)

రామ—(కరుణౌత్సుక్యములతో) ఆ శాబమున కేమి?

(మరలఁదెఱలో) "కవగొని కాంతతోడ—(ఉత్తరార్ధము వినఁబడును)

సీత—దాని నెవ్వ రెదుర్కొందురు?

రామ—ఏడ నా దుష్టమృగము? వధూ సహచారి యగు ప్రియాపుత్త్రికుని బరాభవించు న దెయ్యది? (లేచును)

వాసం—(తొందరతోఁ బ్రవేశించి) ఏమీ? రఘుస్వామియా?

సీత—ఏమీ? నా ప్రియ సఖి వాసంతియా?

వాసం—దేవా! జయము.

రామ—(నిరూపించి) ఏమీ? దేవీ ప్రియసఖి వాసంతియా?

వాసం—దేవా! త్వరపడుము త్వరపడుము. ఇటు జటాయు శిఖరంబునకు దక్షిణంబగు సీతాతీర్థంబున గోదావరి నవతరించి దేవీపుత్త్రికుని బరిరక్షింపుము.

సీత—హా! తండ్రీ! జటాయూ! ఇప్పుడు నీవు లేమి జనస్థాన మెల్ల శూన్యమయినది.

రామ—అహహా! ఈ కథా ప్రసంగములు హృదయ మర్మముల భేదించు చున్నవి గదా!

వాసం—దేవా! యిట్టిటు.

సీత—భగవతీ! నిక్కముగ వనదేవతలు సైతము నన్ను గాంచుట లేదు.

తమ—ఓవత్సా! జాహ్నవీదేవి ప్రభావము సర్వ దేవతల కన్న నుత్కృష్ట మైనది. నీ కీ సంశయం బేల?

---

వృత్తిపరంపర=సంకల్పపరంపర, వధూసహచారి=ఆఁడు ఏనుఁగుతోఁ గూడియుండు, ప్రియాపుత్త్రికుని = సీతకు సంతానతుల్యమగు నేనుఁగును.

సీత—అట్లయిన ననుసరింతము. (పరిక్రమింతురు.)

రామ—(పరిక్రమించి) భగవతీ ! గోదావరీ ! నీకు నమస్కారము.

వాసం—(చూచి) దేవా ! విజయశాలియు వధూసహాయుఁడు నగు దేవీ పుత్త్రకుని గాంచి యానందింపుము.

రామ—ఆయుష్మంతుఁడు జయించుఁ గాక!

సీత—ఓహో ! యిది యింతటి దైనది.

రామ—దేవీ ! వర్ధిల్లుచుంటివి. సంతోషము !

చ. లలిత మృణాళి పల్లవ విలాస రదాంకురుఁ డౌచు నీదు వీ
నుల లవలీ ప్రవాళము వినోదమునం గొను నీ సుతుండు బల్
చెలువున మత్తవారణ విజేతయు యౌవన రాజ్య పూజ్య మం
గళ విధికిన్ శుభాంగిరో ! ఘనంబుగ భాజనమయ్యె నేటికిన్. 15.

సీత—ప్రసన్న దర్శన యగు నికాంతతో నిప్పుడీ దీర్ఘాయు వెడ బాయ కుండుఁ గాత !

రామ—సఖీ ! వాసంతీ ! చూడుము. చూడుము. ఈ వత్సచేఁ గాంతానుసరణ నైపుణ్య మభ్యసింపఁ బడిన ట్లున్నది.

చ. లలిత మృణాళ నాళ కబళంబులఁ గైకొన విచ్చు పుష్కరం
బుల గల గంధతోయములఁ బుక్కిలులం గొని మేనఁ దుంపురుల్
జిలుకుచుఁ జల్లులాడి, కడుఁ జెల్మి దలిర్ప నవక్ర దండ ని
శ్చల మగు నబ్జినీదళము ఛత్త్రము బట్టె విరామ వేళలన్. 16.

సీత—భగవతీ ! తమసా ! యిది యింతటి దైనది. ఇంతలో నా కుశలవు లెట్లుండిరో యెఱుంగను?

తమ—ఇది యెంతటిదో వారు నంతటివారే.

సీత—నేను మిగుల మందభాగ్యురాలను. ఆర్యపుత్త్ర విరహమే కాక పుత్త్ర విరహము గూడ నాకు సంభవమైనది.

తమ—భవితవ్య మిట్టిది.

---

రదాంకురుఁడౌచు = మొలకదంతములు కలవాఁడై, లవలీప్రవాళము=లవలీలత యొక్క పల్లవము, పుష్కరంబులు = తెల్లతామరయునియు, గజతుండాగ్రమనియు, రెండర్థములుంగూడనగును. తోయములు = ఉదకములు, అవక్రదండ = తిన్ననికాడగల, అబ్జినీదళము = తామరాకు, విరామవేళలన్ = విశ్రాంతియందు,

ధవుఁడు వెతం గృశించి, యవదాత రుచిం గని, విక్లబాంగుఁడై,
యవియుట నెట్టకేనిఁ దెలియంబడియున్ నయనాభిరాముఁడౌ. 22.

సీత—చూచుచుంటిని సఖీ ! చూచుచుంటిని.

తమ—దయితుని సదా కాంచుచుందువుగాక !

సీత—హా ! దైవమా ! ఇతఁడు నన్నును నే నితనిని విడుతుమని యెవ్వరెఱుంగుదురు? కానజన్మాంతరంబునుండియుం బోలె సందర్శించుచున్న నేనువత్సలుండగు నార్యపుత్త్రుని బాష్పాంతరకాలముల ముహూర్తమాత్రమైనం బరికింతును. (అత్యాదరముతోఁ జూచుచుండును)

తమ—(స్నేహబాష్పములతోఁ గౌఁగిలించి)

గీ. మోద ఖేదంబులను వెల్లి బూను బాష్ప
ధారఁ గొల్పుచు ప్రేమ నుత్తాన దీర్ఘ
మైన నీచూడ్కి ప్రాణేశు నర్థిఁ దడిపె
బహుళ సిత ముగ్ధ దుగ్ధస్రవంతి వోలె. 23.

వాసం—

చ. ఫల కుసుమార్ఘ్యమున్ విటపి వర్గ మొసంగెడుగాత ! విస్ఫుర
జ్జలజ మరంద గంధములఁ జల్లి మరుత్తతి వీచుఁగాత ! బ
క్షులు సతతోత్సుకత్వ మొనగూడఁ గలధ్వను లిచ్చుఁగాత ! బెం
పలరఁగ రాముఁడిప్డు నిఁ దవంతనె చేరఁగ వచ్చె రమ్యతన్. 24.

రామ—సఖీ ! వాసంతీ ! యిటఁ గూర్చుండుము.

వాసం—(కూర్చుండి కన్నీళ్లతో) మహారాజా ! లక్ష్మణ కుమారునకుఁ గుశలమా ?

రామ—(వినమి నభినయించి)

గీ. పాణితల దత్త నీర నీవార కుశలఁ
దరుణి పెంచిన తరు పక్షి హరిణకములఁ
గాంచఁ బ్రస్తరోద్భేదయోగ్యరసము వలె
హృదయము గరంచు విక్రృతి యొండొదవె నాకు. 25.

---

అవదాతరుచి=తెలుపుకాంతి, విక్లబాంగుఁడై=చిక్కినయవయవములు కలవాఁడై, ఉత్తానదీర్ఘము=దీర్ఘముగాఁ బ్రసరింపఁజేయఁబడిన, దుగ్ధస్రవంతి=పాలకాలువ, విటపివర్గము=వృక్షసమూహము, మరుత్తతి=గాలియొక్క సముదాయము, ప్రస్తరోద్భేదయోగ్యరసము=రాళ్లనుబగులఁగొట్టుట కర్హమగు రసమనియు, రాళ్లయొక్క యుత్పత్తికర్హమగురసమనియుఁ జెప్పఁదగినదొప్పును, విక్రృతి=వికారము.

వాసం—మహారాజా ! అడుగుచుంటిని, లక్ష్మణ కుమారునకుఁ గుశలమా ?

రామ—(తనలో) అన్నా ! "మహారాజా!" యని ప్రేమ లేని సంబోధనము; సౌమిత్రి యెడలనే బాష్ప గద్గదంబులతోఁ గుశలప్రశ్నము;—కాన నీమె సీతా వృత్తాంతంబు నెఱింగిన దని తలంతును. (ప్రకాశముగా) ఆఁ ! సేమమే కుమారునకు ! (ఏడ్చును)

వాసం—ఓదేవా ! మఱేమి కలదు? దారుణుండ వైతివి గదా !

సీత—సఖీ ! వాసంతీ ! యిట్లు పలుక నీ వేమైతివి ? ఆర్యపుత్త్రుఁ డెల్లరకుం బూజార్హుండు గదా !—మఱియు నా ప్రియసఖికి;

వాసం—

ఉ. ఈవె మదీయ జీవితము; నీవె ద్వితీయ మనోంబుజంబవౌ;
దీవె మ దక్షి చంద్రికవు; నీవె శరీర సుధారసంబు; వం
చీవిధిఁ బెక్కు తియ్యములఁ నింతిని గూడి మెలంగి దానినే—(నిట్టూర్చి)
ఆవలివార్త యేల యిఁక నక్కట ! పాపము శాంతిఁబొందుతన్. 26.

(మూర్ఛిల్లును.)

రామ—యుక్తము గదా ! వాఙ్నివృత్తియు మోహంబును ! సఖీ ! ఊరడిల్లుము.

వాసం—(ఊరడిల్లి) దేవా ! యిట్టి యకార్య మాచరించితి వేమి ?

సీత—సఖీ ! వాసంతీ ! చాలింపుము చాలింపుము.

రామ—లోకము సహింపనిది.

వాసం—అది యేల ?

రామ—ఏదో లోకమే యెఱుంగును.

తమ—ఉచితమే లోకదూషణము.

వాసం—

ఉ. ఓ కఠినాత్మ ! నీకు రహి నొప్పు యశం బె కదా ! మనఃప్రియం !
బీ క్రియ కన్న ఘోర మగునే యపకీర్తి మహిం జెలంగు ? నా
భీకర కాననంబున విభీత మృగేక్షణ కేమి యయ్యె ? ని
న్నీ ! కులాధినాథ ! మది నేమి తలంచుచు నుంటి ? చెప్పుమా ! 27.

---

చంద్రిక=వెన్నెల, తియ్యము=ప్రియము, వాఙ్నివృత్తి=మాటను నిలిపివేయుట, మోహము=మూర్ఛ, విభీతమృగేక్షణ = మిక్కిలి భయపడిన లేడివంటి చూపులుగలది, కులాధినాథ=భూభర్త.

రామ—హా! కష్టము కష్టము!

మ. ఘన సంవేగమునన్ మనం బగలు, బ్రకాశిల్ రెండుగాఁ గాదు; మఱిం
దని పీడం జెడి మేను మూర్ఛఁగను, జైతన్యంబు వీడోఁడు; వె
ల్లిన నంతర్జ్వలనంబు దేహము రగుల్పున్, భస్మముం జేయ; దె
చ్చిన మర్మంబులఁ జెండి దైవము గలంచుం, ద్రెంప దీ జీవమున్. 31.

సీత—ఇట్లే యిది—

రామ—తేజస్వులారా! పౌర జానపదులారా!—

చ. సతి భవనంబున న్నిలువ సైపక పోతిరిగాదె మీర, ల
క్కతనఁ దృణంబుఁ బోలె నడుకానఁ దొరంగితిఁ; గుందనైన మా
నితిఁ; జిరమైత్రి వాటిలు వనీవిషయంబులు నన్ గరంచె; నే
గతియును లేక యేడ్చెదను; గాన ననున్ క్షమియింపుఁ డిత్తఱిన్. 32

తమ—శోకవారాశి నాక్రమింప నతి దుష్కరము.

వాసం—దేవా! కడచినదానికై ధైర్య మవలంబింపుము.

రామ—సఖీ! ధైర్య మవలంబింపు మందు వేల?

గీ. భూమిజా శూన్య మయిన యీ భువనమునకు
వర్తమానంబు ద్వాదశ వత్సరంబు,
సీతయను పేరుఁ గూడ నశించెఁ గాని
రాము జీవితమున కింక లేమి లేదు. 33.

సీత—ఈ యార్యపుత్త్రి వచనంబులచే మూర్ఛితురాల నైతిని.

తమ—వత్సా! అవును.

గీ. పూరిత స్నేహములు శోకదారుణములు
నగుటనివి ప్రీతి నింపు వాక్యములు గావు,
గరళ మిళితంబు లగుచు నిక్కము మరంద
ధార లియ్యవి నీమీఁదఁ బాఱుచుండె. 34.

రామ—వాసంతీ! నేను—

అంతర్జ్వలనంబు=లోపలి యుడుకు.

గీ. లోన నాటి తిరశ్చీనమా నలాత
శల్యమట్లు, విషాగ్రదంశంబు వోలె,
వాడి యగు శోకకీలంబు స్వాంతమర్మ
తతిని ఖండించు చున్న నోర్చితిని గాదె! 35.

సీత—మందభాగ్య నగు నే నిట్టు లార్యపుత్త్రునకు మరల నాయాస కారిణి నైతిని.

రామ—ఇట్టు లతి నిశ్చల స్తంభి తాంతరంగుండ నైనను నా క్షిప్త డీ యావేగ మా యా పరిచిత ప్రియ వస్తు సందర్శనంబున—

మ. అమిత క్షోభ విజృంభి తేంద్రియ గణవ్యామోహమున్ మాన్ప, నేఁ
దమి నే యే యతనం బొనర్చినను దత్త ద్యత్నముం బల్ రయం
బు మెయిం బాఱు ఝరంబు సైకత తటంబుం బోలె లో భిన్నభి
న్నము గావించి వికార మెద్దియొ యెడందం బర్వె నొక్కుమ్మడిన్. 36.

సీత—దుర్నివార భీషణారంభ మగు నీ యార్యపుత్త్రుని దుఃఖ సంరంభంబున నా హృదయంబు నిజశోకోద్భేదంబునం బోలెఁ గంపించు చున్నది.

వాసం— (తనలో) కష్టము! విభుఁ డాపన్నుఁడై యుండెఁ గాన వినోదింపఁ జేసెదను. (ప్రకాశము) దేవా! చిరపరిచితంబు లగు నీ జనస్థాన భూభాగంబుల నవలోకింపుము.

రామ—ఔఁగాక! (లేచిపరీక్షించును.)

సీత—దుఃఖోద్దీపకంబులనే ప్రియసఖి వినోదోపాయ మని తలంచు చున్నది.

వాసం— (కరుణతో) దేవా! దేవా!

మ. తన జాడం గనుగొంచు నీవు తమి నేత కుంజమం దుండ, నో
య్యన గోదావరి సైకతస్థలిని హంసాలోక కౌతూహలం
బున జాగై యరుదెంచుచుం దహతహం బొల్పారు ని న్గాంచి, జ
వ్వని గీలింపదె భీతిఁ బద్మముకుళ ప్రాంచ త్ప్రణామాంజలిన్. 37

---

తిరశ్చీనమా = అడ్డముగాఁదిరిగిన, అలాత = కొఱవివంటి, శల్యమట్లు = బాణాగ్రమువలె, దంశంబు = కోర, శోకకీలము = దుఃఖాగ్ని, అమిత = మిక్కుటమగు, క్షోభ = దుఃఖముచేత, విజృంభిత = వృద్ధిపఱుపఁబడిన, ఇంద్రియగణ = ఇంద్రియ సమూహముయొక్క, సమ్మోహమున్ = మూర్ఛను, ఝరంబు = ప్రవాహము, సైకత తటంబు = ఇసుకగట్టు, ఉద్భేదము = పగులఁగొట్టుట. కుంజము = పొద, ప్రాంచత్ = ప్రకాశించుచున్న.

సీత—దారుణురాల వైతివి. వాసంతీ! దారుణురాల వైతివి. హృదయ మర్మంబులం గల గూఢ శల్యంబులం బెకలించు నీ కథోద్ఘాతములచే మందభాగ్యురాల నగు నన్ను నార్యపుత్త్రునిం గూడ మరల మరలఁ బరితపింపఁ జేయు చుంటివి.

రామ—చండీ! జానకీ! యిటు నటుఁ గనఁబడు నట్లుండియు ననుగ్రహింప కుంటివి.

శా. హా! దేవీ! హృదయంబు వ్రెల్లగలెఁ, దూగాడెం దనూబంధముల్,
భేదంచుం దలఁతున్ జగంబు, దరికొల్పెన్ లోని కీలల్ ననున్,
ఖేదోద్విగ్నత నంతరాత్మయుఁ దమోంధీభూతమౌ నట్లు పై
పైఁ గోరంబుగఁ బర్వె మోహ మిఁక నిర్భాగ్యుండ నెట్లాగెదన్. 38.

(మూర్ఛిల్లును.)

సీత—కటకటా! ఆర్యపుత్త్రుండు మరల మూర్ఛల్లె. హా! ఆర్యపుత్త్రా! మందభాగ్యనగు నన్ను గూర్చి సకల జీవలోక మంగళాధారుండ వగు నీకు మాటిమాటికి జీవిత సంశయంబుఁ గొలుపు దారుణం బగు దశాపరిణామము తటస్థించుచున్నది. హా! హతురాల నైతిని—(మూర్ఛిల్లును)

తమ—వత్సా! ఊరడిల్లు మూరడిల్లుము. మరల నీహస్త స్పర్శమే రామభద్రునకు జీవనోపాయము.

వాసం—ఏమి? ఇప్పటికిని మేల్కొనలేదు. హా! ప్రియసఖి! సీతా! నీప్రాణనాథుని మన్నింపుము.

సీత—(తొందరతోఁ జేరి హృదయమునను లలాటమునను స్పృశించుచున్నది.)

వాసం—సంతోసము! రామభద్రుఁడు తెల్విఁ జెందెను.

రామ—

చ. అమరఁగ దేహధాతు బహిరంతర సీమల నెక్కజంబుగా
నమృతమయ ప్రలేపముల యట్టు లలందుచు నొక్కస్పర్శ జీ
వమునకు నొక్కపెట్టఁ బ్రతిభం గలిగించుచు వెండియుం బ్రమో
దము విరియించి యొండొక విధంబగు మోహము బర్వఁ జేసెడిన్. 39.

(ఆనందమునఁ గన్నులు మూసియే) సఖీ! వాసంతీ! మోదమున వర్ధిల్లుచుంటివి.

వాసం—ఎట్లు?—

---

కథోద్ఘాతములచే=కథలనుజ్ఞప్తికిఁ దెచ్చుటచే, ఉద్విగ్నతన్=అతిశయముచే. ప్రలేపములు=పూఁతలు.

రామ—సఖీ! మఱేమి? జానకి మరల వచ్చినది.

వాసం—ఓదేవా! రామభద్రా! అది యెచ్చట?

రామ—(స్పర్శసుఖము నభినయించి) ఇదిగో! యెదుటనే!

వాసం—ఓయీ! మర్మములఁ జెండు నీ దారుణ ప్రలాపములచేఁ బ్రియసఖీ దుఃఖదగ్ధ యగు మందభాగ్యురాల నన్ను మరల దహించుచుంటివేమి?

సీత—తొలఁగి పోఁగోరుచుంటిని. కాని చిర సౌహార్ద ప్రసన్న శీతలంబై, దీర్ఘదారుణం బగు సంతాపంబు సైతము దోడ్తోడఁ దొలంగించు నార్యపుత్త్రి సంస్పర్శంబున వజ్రలేప లిప్తమైనట్లు చెమర్చుచు నిస్సహ విపర్యస్తమై నా హస్తము పరవశంబైనట్లు కంపించుచున్నది.

రామ—(హస్తము గ్రహించి) సఖీ! ప్రలాపము లెట్లు?

ఉ. ఎయ్యది పెండ్లివేళ గ్రహియింపఁబడెన్ శుభకంకణంబుతో?
నెయ్యది దీర్ఘమైత్రి వహియించె నొ స్వైర సుధార్ద్రసంగతిన్?

సీత—ఆర్యపుత్త్రా! నీవిప్పుడా పురుషుఁడవే యైతివి.

రామ-ఒయ్యన నత్తుషార కరకోపమ సుందరమైన తత్కరం
బియ్యెడ నాకుఁ బట్టువడియెన్ లవలీ మృదు కందళాకృతిన్. 40.

సీత—అయ్యయో! ఆర్యపుత్త్రి స్పర్శ మోహితురాల నగు నాకుఁ బ్రమాద మయ్యెను.

రామ—సఖీ! వాసంతీ! ఆనంద మందీకృతేంద్రియుండనై సాధ్వసంబునఁ బరవశుఁడనై యుంటిని. దీని నీవుఁగూడఁ బట్టుకొనుము.

వాసం—కష్టము! ఉన్మాదమే.

సీత—(తొందరతో విడిపించుకొని తొలఁగి పోవును.)

రామ—హా! హా! ప్రమాదము,

గీ. జడము స్వేదాంచితంబుఁ జంచలము నైన
దాని కరపల్లవంబు సత్వరత మీఁ

---

సౌహార్దము=స్నేహము, వజ్రలేప = సరేసుఅను పూఁతవస్తువుచే, లిప్త= పూయఁబడిన, విపర్యస్తము =వ్యత్యాసము, స్వైర=స్వేచ్ఛగలట్టియు, సుధా=అమృతమువలె, ఆర్ద్ర=చల్లనైనట్టియు, సంగతిన్ = స్పర్శచేత,తుషారము = మంచు, కరకము = వడగల్లు, లవలీ = లవలీలతయొక్క, మృదువైన, కందళము=మొలక, సాధ్వసము=భయము, జడము=చల్లనిది.

జడము స్వేదాంచితంబుఁ జంచలము నైన
మత్కరంబున నుండి సంభ్రష్ట మయ్యె. 41.

సీత—అయ్యయో ! స్వభావమును బొందక నిశ్చలము లై విషయగ్రహణమునం దస
మర్థము లై తత్ప్రియత్నంబున బలాత్కారముగ భ్రమించు నేత్రములతో నార్య
పుత్త్రుం డిప్పటికిని దన్నుఁ దాఁ దెలిసికొన నేరఁ డయ్యెను.

తమ—(స్నేహ హాస కౌతుకములతోఁ జూచి)

గీ. వల్లభస్పర్శ సౌఖ్యంబు వలన సీత
స్వేద రోమాంచ కంపనాన్విత యగుచు
గాలిఁ గదలి, నవీనోదకములఁ దడిసి
కలికల నెసంగు నీపశాఖ యనఁ దనరె. 42.

సీత—(తనలో) ఓహో ! పరవశురాల నై భగవతియగు తమసచే లజ్జింపఁ జేయఁ
బడితిని. "ఇట్టిది పరిత్యాగము, ఇట్టిది హృదయాసంగ" మని యీమె యేమను
కొనునో గదా !

రామ—(కలయఁ జూచి) హా ! యేమిలేనేలేదా? ఓనిర్దయా ! వైదేహీ !

సీత—నిక్కముగ నిర్దయురాలను. ఇట్టి నిన్నుఁ జూచుచుఁ బ్రాణములఁ దాల్చియుంటిని.

రామ—ఎచ్చటనుంటివి ? అనుగ్రహింపుము. ఇట్టి న న్నెడఁబాయ నర్హంబుగాదు.

సీత—ఆర్యపుత్త్రా ! యిదివిపరీతము.

వాసం—దేవా ! ప్రసన్నుఁడవు గమ్ము. ప్రసన్నుఁడవు గమ్ము. అతిశయిత విరహం
బగు నాత్మను నీ లోకోత్తర ధైర్యమున నరికట్టుము. నాప్రియసఖి యిచ్చట
నెట్లుండును ?

రామ—లేదు. నిశ్చయము. ఉన్నచో దాని వాసంతి గూడ నెట్లు చూడకుండును ?
స్వప్నమా యిది !—నేను నిద్రింపలేదు.—కాక రామునకు స్వప్నమెట్లు ?
సర్వవిధంబుల మహామహిమ గల బహువార కల్పనా నిర్మితం బగు నావిప్రలంభ
మే నన్ను మాటిమాటికి వెంబడించుచున్నది.

---

సంభ్రష్టమయ్యె = జారిపోయెను, రోమాంచము = గగుర్పాటు, అన్విత = కూ
డుకొనినది, కలికలు = మొగ్గలు, నీపశాఖ = కడిమికొమ్మ, బహువార = అనేకపర్యా
యములు, కల్పనా = సంకల్పించుకొనుటచేత, నిర్మితంబగు = కలిగించుకొనిన, విప్ర
లంభము = వియోగము,

సీత—ఆర్యపుత్త్రుఁడు దారుణురాల నగు నాచేత నే వంచింపఁ బడియె.

వాసం—దేవా ! చూడుము చూడుము.—

మ. అల పౌలస్త్య జటాయు నిర్దళిత కృష్ణాయోరథం బిద్ది, ముం
గల నాభీల పిశాచ వక్త్రయుత కంకాళాత్మలౌ రాసభం
బులివే ! హేతి జటాయు పక్షతుల నిర్మూలించి నీశతుృఁడు
జ్జ్వల సీతం గొని మింటికేగెఁ జలితాంతర్విద్యుదబ్దంబనన్. 43.

సీత—(భయముతో) ఆర్యపుత్త్రా ! తండ్రి హతుఁ డగుచుండె, నేనపహరింపఁ
బడుచుంటిని, రక్షింపు రక్షింపు.

రామ—ఆ ! పాపిష్ఠ ! తాత ప్రాణ సీతాపహారీ ! ఎందుబోయెదవు ?

వాసం—ఓదేవా ! రాక్షసాన్వయ ప్రళయ ధూమకేతూ ! నీకోప్రిన విషయ మిప్ప
టికినా ?

సీత—ఓహో ! ఉన్మత్తురాల నైతిని.

రామ—ఇప్పుడీ ప్రలాపము సార్థకమే యైయున్నది.

చ. సతత వినోదముం గొలుపఁ జాలు నుపాయములం దనర్చి యు
ద్ధత రిపు వీర సంహృతుల ఖ్యాతి మహాద్భుతమున్ ఘటించు నా
సతి తొలి విప్రలంభ మది శత్రువధావధి యయ్యెఁ గాని ప్ర
స్తుత విరహం బనంత గతిఁ జొప్పడె నూరక యెట్టుఁ జెప్పదన్? 44.

సీత—అనంతమైన దనియా హా ! హతురాల నైతి మందభాగ్యురాలను. (ఏడ్చును.)

అల = ఆ, పౌలస్త్య = రావణునియొక్క, జటాయు = జటాయువుచే, నిర్ద
ళిత = విఱుగఁగొట్టఁబడిన, కృష్ణ = నల్లనగు, అయోరథంబు = ఇనుముచేఁజేయఁబడిన
రథము, ఆభీల = భయంకరమగు, పిశాచముల యొక్క, వక్త్రయుత = ముఖములతోఁ
గూడుకొనిన, కంకాళాత్మలౌ = అస్థిపంజరాకృతములయిన, రాసభంబులు = గాడిద
లు, హేతి = ఖడ్గముచే, జటాయువు యొక్క, పక్షతులన్ = ఱెక్కలమూలములను,
నిర్మూలించి = తెగనఱికి, నీశతుృఁడు, చలిత = చలించుచున్న, అంతః = లోన,
విద్యుత్ = మెఱుపుగలిగిన, అబ్దంబనన్ = మేఘమాయెనునట్లు, ఉజ్జ్వల = ప్రకాశించుచు
న్న, సీతంగొని—మింటికి = ఆకాశమునకు, ఏగె. ధూమకేతువు = తోఁకచుక్క, సం
హృతుల = చంపుటచే.

రామ—హా ! కష్టము !—

చ. అలకపిరాజు చెల్మి, కపులందటి బీరము, భల్లుకేంద్రు ధీ
బలమును, నెందు నిష్ఫలము ? పావని యెందుఁ జొరంగ నేరఁ? డా
నలుఁ డను విశ్వకర్మ హిత నందనుఁ డెందుఁ బథం బొనర్పలే ?
డలుగుల కెందు లక్ష్మణున కందదొ ? యూయెట నుంటివో ? ప్రియా ? 45.

సీత—పూర్వ విరహమును గూర్చి మన్నింపఁ బడితిని.

రామ—సఖీ ! వాసంతీ ! సఖులకు దుఃఖమునకై ఆకే రామ సందర్శనము. ఎంతవఱకు నిస్నేడ్పింతును ? కానఁ బ్రియాణంబునకై నాకు సెల వొసఁగుము.

సీత— (భయ మోహములతోఁ దమసం బట్టుకొని) భగవతీ! తమసా! ఆర్యపుత్త్రుం డరుగుచుండె నేమిగతి?

తమ—వత్సా! ఊరడిల్లు మూరడిల్లుము. ఆయుష్మంతులగు కుశ లవులకు వర్షగ్రంథి మంగళము సాపాదింప భాగీరథీ పదసన్నిధికి మనమునుం బోవుదము.

సీత—భగవతీ! అనుగ్రహింపుము. దుర్లభ జనుని క్షణమాత్రి మవలోకింతును.

రామ—కల దిప్పు డశ్వమేధమునకై నాకు సహధర్మ చారిణి.

సీత— (కంపముతో) ఆర్యపుత్త్రా! అది యెవతె ?

రామ—హేమమయం బగు సీతాప్రతిమ.

సీత— (ఊరడిల్లి కన్నీళ్ళతో) ఇప్పుడు నీ వార్యపుత్త్రుండవైతివి. ఓహో! ఇప్పు డార్యపుత్త్రుండు నా పరిత్యాగ శల్యంబు నున్మూలించె.

రామ—దానియందైనను బాష్పపూర్ణమగు దృష్టికి సంతుష్టిఁ గల్గించెదను.

సీత—ఆర్యపుత్త్రునిచే మన్నింపఁ బడుచు నాతని నానంద పఱచుచు జీవలోకమున కాశానిబంధనం బయ్యెఁ గాన నది ధన్యురాలు.

తమ— (స్మిత స్నేహబాష్పములతోఁ గౌఁగిలించి) ఓవత్సా! ఆత్మ స్తవముం జేసి కొనుచుంటివి.

---

విప్రలంభము = వియోగము, శత్రు = విరోధులయొక్క వధ=చంపుటయే అవధి=హద్దు, కపిరాజు=సుగ్రీవుఁడు, కపులు=కోఁతులు, భల్లుకేంద్రుఁడు = జాంబవంతుఁడు, పావని = అంజనేయుండు, పథము = మార్గము, ఉన్మూలించె=ఊడఁ దెరికె.

సీత— (లజ్జతోఁ దలవంచి తనలో) భగవతి పరిహసించు చున్నది.

వాసం— ఈ సమావేశము మాకు మహానుగ్రహము. ప్రియాణ విషయమున నెట్లు కార్యభంగము గల్గదో. అట్లుకావింపఁ దగును.

సీత—ఇప్పుడు వాసంతి నాకుఁ బ్రతికూల యైనది.

తమ—రమ్ము పోవుదము.

సీత— (కష్టముతో) అట్లే చేయుదను.

తమ—ఎట్లు రాఁ గలవు?

గీ. వల్లభునియందు నెఱి నాటఁ బడిన యట్టి
వేడ్క చే సోఁగ బారు నీ వీక్షణంబు
మర్మములఁ దుంచు యత్న సంపదల నైనఁ
డివియఁ బడఁ జాల దయ్యె నుదీర్ణభంగి. 46

సీత—అపూర్వ సుకృత జనిత దర్శనంబు లగు నార్యపుత్రి పాదపద్మములకు నమస్కారము. (మూర్ఛిల్లును)

తమ—వత్సా! ఊరడిల్లు మూరడిల్లుము.

సీత— (ఊరడిల్లి) మేఘాంతరాళమునఁ బూర్ణిమా చంద్రు నెంతకాల మవలోకింపఁ గలము?

తమ—ఓహో! ఘటనా విశేషము.

చ. కరుణరసంబు పన్నుగ నొకం డయి యుండి నిమిత్తభేదత
త్పరత విభిన్నమై వివిధమై ఖురులం బలె మార్పులొందు, వి
స్ఫురిత తరంగ సంభ్రమణ బుద్బుద రూప వికార సంతతిం
బొరసియుఁ గన్గొనం జలము బొందుగ సర్వము దానయా గతిన్. 47.

రామ—విమానరాజమా! యిట్టిటు. (అందఱు లేచుచున్నారు.)

---

ఉదీర్ణభంగి=విశేషముగా, విస్ఫురిత=చలించుచున్న, తరంగ=అలలయొక్కయు, సంభ్రమణ=సుడులయొక్కయు, బుద్బుద=బుడగలయొక్కయు, రూప=ఆకృతులచే, వికార=మార్పుయొక్క, సంతతిన్=పరంపరను, పొరసియు=పొందియు.

తమ—వాసం— (సీతారాములం గూర్చి)

గీ. పుడమి మిన్నేలుఁగూడ మా పొంట్లతోడఁ
దొలుత ఛందఃపరియోక్తయా కులవిభుండు
ననుగతారుంధతీకుఁడౌ ముని వసిష్ఠుఁ
డొసఁగు భద్రంబు బహుభవ్య మెసఁగ మీకు. 48

(అందఱు నిష్క్రమింతురు.)

ఛాయ యను తృతీయాంకము,

సంపూర్ణము.



ఛందః=వేదములను, పరియోక్తయా = చెప్పినవాఁడగు, కులవిభుండు=సూర్య వంశ స్థాపకుఁడగుసూర్యుఁడు, అనుగతారుంధతీకుఁడు=అనుసరింపఁబడిన అరుంధతిగల వాఁడు, భవ్యమెసఁగ=మంగళ మగునట్లు.



# ఆంధ్రీకృతోత్తరరామచరితము.

## చతుర్థాంకము.

(ఇద్దరు తాపసులు ప్రవేశింతురు)

ఒకఁడు—సౌధాతకీ ! యిపుడు విశిష్టాతిథి జనాలంకృతం బగు వాల్మీకిభగవాను నా శ్రమ స్థానమందలి విపులకార్యోపక్రమరమణీయకంబుం గనుంగొనుము.

మ. నవనూతప్రియ గోల్ల నున్న మధురోష్ణం బైన నీవార భ
క్త వరస్రావము దృప్తి నాశ్రమ కురంగం బానుచుండెన్, ఘృతా
ప్లవ రుచ్యాన్న లసత్సుగంధ లవ సంప న్మిశ్రమై చాల నిం
డవు కర్కంధుఫలాఢ్య శాక పచనోత్థామోద మేపారెడిన్. 1.

సౌధాతకి—ఇప్పుడీ నెఱసిన పెద్ద గడ్డముల వారికి మహత్తర మయిన యనధ్యయన కారణము సంభవించినది.

ప్రథముఁడు—(నవ్వి) సౌధాతకీ ! గురువులయందు బహుమాన కారణ మపూర్వ ముగా నున్నదే ?

సౌధా—ఓభాండాయనా ! యిప్పుడీ మిక్కుట మగు వృద్ధసంఘముననెు మొనగాఁడై నారలు గట్టి వచ్చినయీయతిథి పేరేమి?

---

నవనూత=క్రొత్తగానీనిన, నీవార=నివ్వరి, భక్త=అన్న సంబంధమయిన, స్రావము=గంజి, ఘృత=నేతితో, ఆప్లవ=లెస్సగాఁదడుపఁబడిన, రుచ్యాన్నము= రుచిగలయన్నము నుండిబయలు వెడలిన, లసత్సుగంధలవ=సువాసనయొక్క లేశము యొక్క, సంపన్మిశ్రమై=సంపత్తుతో గూడినదై, కర్కంధుఫల=రేఁగుపండ్లతో, ఆఢ్య=ఎక్కువగాఁజేయఁబడిన, శాక=కూరయొక్క, పచన=వండుటయందు, ఉత్థ= బయలు వెడలిన, ఆమోదము=పరిమళము.

భాండా—ఛీ ! పరిహసించెదవు ? ఋశ్యశృంగాశ్రమము నుండి యరుంధతిని మును కొనిన దశరథేంద్రుని భార్యలకు నియామకుఁడై వసిష్ఠమౌని విచ్చేసె. ఇట్లు ప్రేలెద వేల ?

సౌధా—ఆఁ ? వసిష్ఠుఁడా ! నేను తోఁడేలో ? బెబ్బులియో ? యనుకొంటిని.

భాండా—ఆఁ ! యేమనుచుంటివి ?

సౌధా—ఆతఁ డరుదెంచినంతనే దిక్కులేని యాఁబెయ్య డమ్మని చంపఁబడినది.

భాండా—"సమాంసో మధుపర్క" యను నామ్నాయమును మన్నించుచు గృహస్థులు శ్రోత్రియాతిథి కొఱకు వత్సతరిని గాని మహోక్షమును గాని మహాచ్ఛాగమును గాని యిచ్చుచుందు రని ధర్మసూత్రకారులు పలుకుచున్నారు.

సౌధా—ఓహో ! ఓడిపోయితివి.

భాండా—ఎట్లు ?

సౌధా—వసిష్ఠమిశ్రు లరుదేర వత్సతరిని హింసించె. సద్య స్సమాగతుఁ డగు జనక రాజర్షి కి వాల్మీకి భగవానులు దధి మధువుల చేతనే మధుపర్కమును నెఱవేర్చె. వత్సతరిని విడిచె.

భాండా—ఋషులు మాంసాహారమును మాననివారి కీకల్పము ననుమతించుచున్నారు. పూజ్యుఁ డగు జనకుఁడో మాంస పరిత్యాగి.

సౌధా—ఏల ?

భాండా—ఆతఁ డప్పుడే సీతాదేవి కిట్టి దైవప్రాతికూల్యమును విని వానప్రస్థుఁ డయ్యె. అట్లు చంద్రద్వీప తపోవనంబునఁ దపం బొనర్చుచుండు నితనికిఁ గొన్ని వత్సరంబులు గతించె.

సౌధా—పిదప నిచ్చటికేల వచ్చె ?

భాండా—పురాతన హిత మిత్రుఁ డగు వాల్మీకిమౌనిని సందర్శింప.

సౌధా—ఇప్పు డితనికి బంధు సందర్శనం బయ్యెనా ?

భాండా—ఇప్పుడే వసిష్ఠ భగవానులు కౌసల్యాదేవి చెంతకు భగవతి నరుంధతిం బంపి విదేహనాథుని స్వయముగా నరిగి చూడ నియమించె.

---

ఆమ్నాయము=వేదము, వత్సతరి=ఆఁబెయ్య, మహోక్షము=పెద్దయెద్దు, ఛాగము=మేక, సద్యస్సమాగతుఁడగు=అప్పుడేవచ్చిన, దధి=పెరుగు, మధువు=తేనె

సౌధా—ఈవృద్ధులందఱు నొండొరులు గలిసికొనినట్లు బ్రహ్మచారులం గూడి మనమును అనధ్యాయ మహోత్సవంబు నాటలతో బహూకరింతము.

భాండా—బ్రహ్మవేత్తయుఁ బురాతన రాజర్షియు నగు నీజనకుండు వసిష్ఠ వాల్మీకుల సేవించి యిప్పుడాశ్రమ ప్రాంత వృక్ష మూలమున నున్నవాఁడు.

క. ఈతఁడు మది నిత్యోజ్జ్వల
సీతాశోకంబు వలనఁ జేట్పడి యంత
స్స్యూతానల మగు జరఠీ
భూత వనస్పతియుఁ బోలెఁ బొగులుచు నుండెన్. 2.

(నిష్క్రమించిరి.)

విష్కంభము.

పిమ్మట జనకుఁడు ప్రవేశించుచున్నాఁడు.

జన—

ఉ. నందనయందుఁ దాదృశ ఘనవ్యతిరేకము గల్గి తీవ్రమై
డెందము వ్రచ్చి వేదన గడిందిగఁ జేసి పురాతనత్వముం
జెందియుఁ గ్రొత్తవోలె నెడసేయక యేచు దురంత శోకముం
గ్రందుగఁ గూర్చి మర్మముల రంపమునం బలెఁ గోసి దానిచేన్. 3.

కష్టము! ఇట్లు వార్ధకంబునను, దుస్సహం బగు దుఃఖంబునను, మఱియుఁ బరాక సాంతపనాది తపంబులను, రసధాతువులుశుష్కింప దుర్బలం బైన నా దగ్ధదేహమిప్పటికిం గూల దయ్యె.— "ఆత్మఘాతుకుల కంధతమసావృతంబు లగు నసుర్యలోకంబులు విధింపఁబడు" నని మహర్షులు తలంచుచున్నారు. పెక్కేండ్లు గడచినను బ్రతిక్షణోద్భేదంబుచే స్పష్ట నిర్భాసమై నూత్నమైనదియుం బోలె దారుణం బైన నాదుఃఖోద్వేగ ముపశమింప దయ్యె. ఓ తల్లీ! దేవయజన సంభవా! సీతా! నీని

ఉజ్జ్వల = మండుచున్న, అంతస్స్యూతానలము=తొఱ్ఱలో నిప్పుగల, జరఠీభూత=ముదిసిన, వనస్పతి=వృక్షము, తాదృశ = అట్టి, ఉద్భేదము = బాధించునది, నిర్భాసమై=ప్రకాశించునదియై.

ర్మాణభాగ మిట్లు పరిణమించెనా ? ఈ లజ్జచే, నిచ్చకొలంది విలపింపనైన వలను లేదుగదా ! హా ! హా ! కుమారి ! —

గీ. అనియత స్మిత రుదితంబు, నమల విరళ
మంజుతర దంత కలికాగ్ర రంజితంబు,
స్ఖల దసంబద్ధ ముగ్ధ వాక్యంబు నగుచుఁ
దనరు నీ చిన్ని మోము దమ్మిని దలంతు. 4.

భగవతీ ! సర్వంసహా ! నీవు నిక్క-ముగ మిక్కి-లి కఠినురాలవు. —

చ. అనలుఁడు, నీ, వరుంధతి, మహర్షులు, గంగయు, రాఘువాన్వయం
బెనయు గురుండు దేవుఁ డినుఁ, డీసతిశీల మెఱుంగువారు ? వి
ద్యను త్రయివోలె నేయమ నుదారతఁ గాంచితి ? వట్టి దైవతం
బనఁ దగు నట్టి నీ తనయకా విషమం బెటు లోర్తు నిష్కృపా ! 5.

(తెఱలో) భగవతి ! మహాదేవీ ! యిట్టిటు.

జనకుఁడు — (చూచి) ఓహో ! గృష్టి ప్రదర్శిత మార్గ యగు భగవతి యరుంధతి. (లేచి) మహాదేవి ! యనె నేమెను ? (నిరూపించి) హా ! యెట్లు ! మహారాజ దశరథుని ధర్మపత్ని నాప్రియసోదరీమణి కౌసల్యయా ? ఆమెయే యీమె యని యెవ్వఁడు గుర్తింప నేర్చును ? —

గీ. ఈమె సిరివోలె దశరథు నింటఁ దనరె;
నట్టి యుపమానపద మేల ? యతివ సిరియె;
అకట ! సాకార శోకమ ట్లోకవిధంబుఁ
బడసె విధిచేత నీమె ; విపాక మహహ ! 6.

---

అనియత = కారణములేని, స్మిత = నవ్వును, రుదితంబు = దుఃఖమును గలదియు, అమల = స్వచ్ఛమగునట్టియు, విరళ = విశాలమగునట్టియు, మంజుతర = మిక్కి-లి మృదువైనట్టియు, దంత = దంతములను, కలిక = మొలకలమొక్క-, అగ్ర = కొనల చే, రంజితంబు = మనోహరమయినట్టియు, స్ఖలత్ = తొట్రుపడునట్టియు, అసంబద్ధ = సందర్భ శూన్యమైనట్టియు, ముగ్ధ = సుందరమైనట్టియు, వాక్యంబు = పలుకులు గలిగినట్టియు, త్రయి = వేదము, విద్యను = తత్త్వజ్ఞానమునువలె, గృష్టి = కంచుకి పేరు. సాకార = రూపముఁదాల్చిన.

ఇది ఘోర మగు వేఱొక దశాపరిణామము;

క. మును నా కేజనము మెయిం
గనిన మహోత్సవము భంగిఁ గనఁబడెఁ దద్ద
ర్శన మిపుడు మందు గాయం
బున లవణముగతి *ననిష్టముగఁ దోఁచెఁ గడున్. 7

(పిదప నరుంధతి, కౌసల్య, కంచుకి ప్రవేశింతురు)

అరుంధతి—చెప్పుచుంటిని, "తనంతఁదాఁజని విదేహనాథునిం జూడఁ దగు" నని మీ కులగురుం డానతిచ్చె. అందులకే నన్ను బంపె. కాన నడుగడుగున నీ యెడ తెగని సంకోచ మేటికి ?

కంచు—దేవీ ! హృదయంబు నెలకొల్పుము. వసిష్ఠ భగవాను నానతి ననుసరింపు మని విన్నవించు చుంటిని.

కౌస—ఇట్టి కాలమున మిథిలేశ్వరుని జూడ వలసి వచ్చె నని సర్వదుఃఖము లొక్క పెట్టున నావిర్భవించు చున్నవి. సమూలంబుగా నున్మూలింపఁ బడు హృదయము నిలువరింప నసమర్థురాల నై యుంటిని.

అరుం—ఇం దేమి సందియము ?

గీ. ప్రజల కుత్తమ బాంధవాపాయ దుఃఖ
భారములు నిత్యసంతాన వాహులయ్యుఁ
స్వజనుల సమాగమమున దుస్సహములగుచు
సాఁగ బాఱు ఝరీ సహస్రములఁ బోలె. 8.

కౌస—వత్సయగు జానకి కిట్లు సంభవించియుండ, నా రాజర్షి నెట్లు మెట్లు చూడఁ గలను ?

అరుం—గీ. యాజ్ఞ్యవల్క్య మునీంద్రుని యంతికమున
బ్రహ్మ పారాయణ మొనర్చి పరిఢవిల్లి
జనకవంశ్యుల కెల్ల భూషణ మనంగ
వరలు మీ శ్లాఘనీయ సంబంధి యితఁడె. 9.

---

విపాకము = విరుద్ధపరిణామము. పాఠాంతరము:—*ననసహ్యముగ: అంతికమున=సన్నిధి, బ్రహ్మపారాయణము = వేదాధ్యయనము.

కౌస — ఇతఁడు మహారాజునకు హృదయానందుండును వత్సయగు జానకికిఁ దండ్రియు నగు రాజర్షి; హా యిట్టి కష్టకాలమున మన్నింపఁ బడితిని. హా! దేవా! ఆ సర్వ మిప్పుడు శూన్యము.

జన — (సమీపించి) భగవతీ! అరుంధతీ! వైదేహుఁడగు సీరధ్వజుఁడు నమస్కరించు చున్నాఁడు.

చ. గురుతుగఁ బూర్వపుం గురులకుం గురువర్యుఁడు, శుద్ధ సన్మహో
భరుఁడును, నీదు భర్త నిను బట్టి తనున్ శుచిగాఁ దలంచె; నా
గరితవు లోకవంద్యవు, జగచ్ఛుభమూర్తివి, నీకు భూతల
స్థిరశిర మొప్ప నో భగవతీ! తొలిసంజకుఁ బోలె మ్రొక్కెదన్. 10.

అరుం — పరంజ్యోతి నీకావిర్భవించుఁగాక! జాజ్వల్యమానుఁడై రజోగుణాతీతుఁడగు దేవుండు నిన్ను బవిత్రీకరించుఁగాక!

జన — ఆర్య! గృష్టి! సేమమా యీనరపాలజననికి?

కంచు — (తనలో) అతినైష్ఠుర్యమున నిశ్శేషముగా గర్హింపఁ బడితిమి. (ప్రకాశముగా) రాజర్షిచంద్రా! ఈకోపముననే చిరకాలమునుండి రామభద్ర వదనేందు దర్శనంబు నీడి మిగుల దుఃఖించు దేవిని నియమాగ్రహముచే దుఃఖింపఁ జేయఁ జనదు. రామభద్రుఁడైనను దుస్సహంబగు కింవదంతి నెల్లెడల ఘూర్ణిల్లఁ జేయు నత్యల్పులగు పౌరజానపదులు పావకశుద్ధిని విశ్వసింప లేదని యిట్టి దారుణం బాచరించె.

జన — ఆఁ! మా యపత్యంబు శోధింపఁ బావకుం డన నెవ్వఁడు? కష్టము! ఇట్లు పల్కు మానవునిచే మేము రామతిరస్కృతుల మయ్యును మరలఁ దిరస్కరింపఁ బడుచుంటిమి.

అరుం — (నిట్టూర్చి) ఇదియిట్లే; వత్సయెడల నగ్నియను నక్షరంబు లతిలఘువులు, సీత యనియే చాలును. హా! వత్సా!

చ. ఒనరఁగ శిష్యవో? తనయవో? యగు దయ్యది యుంచు మట్లు; నీ
ఘనతర శుద్ధి నీయెడల గొటపు భక్తి జనింపఁ జేసె; నం
గనవును బాల వయ్యును జగత్త్రియ వాద్యవు గావె? పూజనం
బెనయ గుణాఢ్యులందు గుణమే తగు; లింగముఁ బ్రాయమున్ వృథా. 11.

సీరధ్వజుఁడు = నాగలిజెండాగాఁగలవాఁడు, మహోభరుఁడు = తేజశ్శాలి.

కౌస — అక్కటా! వేదన లుప్పొంగుచున్నవి. (మూర్ఛిల్లును)

జన — హా! కష్టము! ఏమిది ?—

అరుం — రాజర్షి! వేతేమి ?—

చ. అల ధరణీశుఁ, డా సుఖము, నా శిశువర్గము, నా దినంబులుం,
జెలి వగు నిన్ గనం దలఁపు జెందె సమస్తము; గాన నిమ్మహో
జ్జ్వల మగు దారుణంబున భవత్సఖి మూర్ఛిత యయ్యె; వారిజా
క్షుల హృదయం బనం గుసుమ కోమల భంగిఁ జెలంగుఁ గాదొకో? 12.

జన — అన్నన్నా! అన్ని విధంబుల ఘాతకుండ నయితి. చిరకాలమునను దర్శించిన ప్రియమిత్త్రుని ప్రియకాంతం జెల్మితోఁ జూడ నయితి.

చ. అతఁ డతి సఖ్యుఁడున్, ఘనత నందిన బంధుగుఁడున్, మనంబు, నా
కృతిగను సమ్మదంబు, నిచయీకృత జీవిత సత్ఫలంబు, నిం
డు తనువో? జీవుఁడో? యధికుఁడో? ప్రియమిత్త్రుఁడు, శ్రీకౌసమ
న్వితుఁడు, మహాత్ముఁడౌ దశరథేశ్వరుఁ డెయ్యది నాకుఁగాడొకో? 13.

కష్టము! ఈకౌసల్య యీమెయే గదా! —

మ. సతికైనం బతికైన వైరము రహస్యంబందుఁ బెంపైన, దం
పతు లన్యోన్య మొనర్చు నిందలకు నేఁ బాత్రుండ నైయుంటి, నా
హిత కోపంబుననే? ననుగ్రహమునందే? కార్యభారంబు మ
ద్గత మయ్యెం, దలపోయ నేల? మది నంతన్ ముట్టి బిట్టేర్చెడిన్. 14.

అరుం — హా! కష్టము! ఈమె హృదయము చిర నిశ్వాస నిర్గమంబుచే దుస్సహంబై యున్నది.

జన — హా! ప్రియసోదరీ! (కమండలు జలముఁ జల్లుచున్నాఁడు)

కంచు — గీ. వర సఖుఁడు పోలెఁ దొల్త నేక రసమైన
యానుకూల్యంబు సుఖదమై యలవరించి
పున రకాండ దారుణ వివర్తనముఁ జెంది
దైవ మకట! మనోవ్యాధి దవులఁజేసె. 15.

నిచయీకృత = పోగుగాఁజేయఁబడిన, ఆహిత = పొందఁబడిన, పునః = తిరిగి, అకాండ=నిష్కారణముగా, దారుణ = భయంకరమైన, వివర్తనమున్ = మార్పును, ఏకరసము = ఇతరముచే భిన్నముగాని రసము.

కౌస—(తెల్వినొంది) హా! వత్సా! జానకీ! యెచ్చట నుంటివి? వివాహ లక్ష్మీ పరిగ్రహాలంకృతంబై సముజ్జ్వల ధవళ ముగ్ధహాసం బయిన నీ సుందర ముఖారవిందంబుఁ దలపోయుచుంటిని. విస్ఫుర చ్చంద్ర చంద్రికాభిరామంబు లగు నీ యంగములచే మరల నో పుత్రి! నాయంకతలంబు నలంకరింపుము. ఇత్యాది 'రఘుకుల కూటస్థులకుం గోడ లయ్యును జనకానుబంధంబున మనకు మాత్రము బుత్రిక యే' యని నిరంతరంబు మహారాజు పలుకుచుండును.

కంచు—దేవి పల్కినట్లే.—

గీ. బిడ్డ లయిదుగు రయిన భూవిభున కరయ
బహుళ సమ్మోదకారి సుబాహువైరి
నలువు రైనను గోడండ్రు వెలయ నతని
కాంత యగు సీత హితురాలు శాంతవోలె. 16.

జన—హా! ప్రియసఖ! మహారాజ దశరథ! సర్వవిధంబుల మనోరముఁడ వగు నిన్నెట్లు మరతును?

మ. ధరణిం గన్నియ తండ్రు లల్లుని నిజాపత్యశ్రేణి నర్చింతు రా
సరణుల్ మారె మనందు; నీవె నను వాంఛ ల్మీఱఁ బూజించి తా
స్థిరశీలుండవు పోతి కాలమున, మాసెన్ బంధుతా బీజ మున్,
నరకాభీల జగంబునం దఘునిధిన్ నాజీవితం బేటికిన్. 17.

కౌస—పుత్రి! జానకీ! దృఢ వజ్రలేపంబుచే నుప నిబద్ధ మైనట్లు సుస్థిరంబగు నా దుష్టజీవితంబు నిర్భాగ్యురాల నగు నన్ను విడిచి పోవుట లేదు.

అరుం—ఊరడిల్లుము రాజపుత్రి! ఎడనెడ నశ్రు విశ్రామంబు నాచరింపనగు. మఱియు ఋశ్యశృంగాశ్రమంబున మీ కులగురుండు "తగని దుఃఖము సంభవించినను శుభోదర్కంబు గాఁగల" దని పల్కిన వాక్య మేల స్మరింపవు?

కౌస—భగవతీ! అడియాస మించినది.

అరుం—రాజపుత్త్రీ! దాని మృషావాక్య మని యే తలంచెదవా? సుక్షత్రియా! అన్యథా తలంపరాదు. నిక్కముగా జరిగి తీరఁగలదు.

---

చంద్రిక = వెన్నెల. అశ్రువిశ్రామంబు=కన్నీళ్ళనరికట్టుట, శుభోదర్కము = శుభము తుదకు రాఁగలకాలము, మృష=అబద్ధము.

గీ. విస్ఫురద్బ్రహ్మతత్త్వాలౌ విప్రవర్యు
లాడు సూక్తుల సందియమంద వలదు ;
భద్రియగు లక్ష్మి వీరల వాణి నిల్చు ;
వ్యర్థవాక్యంబు వీరలు పల్క రెపుడు. 18.

తెఱలోఁ గలకలము—అందఱు నాకర్ణింతురు.

జన—ఈనాఁడు శిష్టానధ్యాయ మని మిక్కుటముగాఁ గ్రీడించు బ్రహ్మచారుల కల కల మిది.

కౌస—బాల్యంబు మాత్రము సులభ సౌఖ్యమైనది. (నిరూపించి) వీరిలో రామభద్రి కౌమార లక్ష్మీ పరిశోభితంబులై మంజులోదార సుందరంబు లగు నంగములచే మన నేత్రములఁ జల్లఁజేయు నీ బాలకుం డెవ్వఁడు ?

అరుం—(స్వగతము ఆనంద బాష్పములతో) ఇదే! భాగీరథీ నివేదిత రహస్య కర్ణామృతము. కాని యాయుష్మంతు లగు కుశ లవులలో వీఁ డెవ్వఁడో యెఱుంగను.

జన—

మ. అసితేందీవర పత్ర కాంతుఁడు, శిఖండాలంకృతుం డు, న్విభూ
తి సమగ్రుండు, దనూరుచిన్ వటుసభన్ దీపింపఁగాఁ జేయుచుం
బసమై వత్స రఘూద్వహుండు మరలం బాలత్వముం దాల్చెనా
వెసఁ గానంబడు వీఁ డెవండొ ? కనులన్ వే వే సుధం బూసెడిన్. 19.

కంచు—ఈ డింభకుఁడు క్షత్రియ బ్రహ్మచారి యని తలంచెదను.

జన—ఇట్లే యిది. కాననే—

మ. వెనుకం జుంచు దగుల్ గఱుల్ వెలయ నిల్పెం దూణముల్ రెండుగా,
బ్రణుతోరస్స్థలిఁ దాల్చె భస్మ రురు చర్మంబుల్ బవిత్రంబు, బా

---

నివేదిత = చెప్పఁబడిన, అసితేందీవరపత్రము = నల్లకలువరేకు, శిఖాండము = జుట్టు, చుంచు = జుట్టు, గఱుల్ = బాణముయొక్క ఱెక్క, తూణములు = బాణములు, రెండుగా = ప్రక్కలను, ప్రణుత = స్తోత్రపాత్రమగు, ఉరస్స్థలిన్ = వక్షస్స్థలమందు, భస్మ = విభూతియు, రురుచర్మంబు = లేఁడితోలు, పవిత్రంబు = యజ్ఞోపవీతమును, దాల్చెను.

వన మాంజిష్ఠ మయాంతరీయమును మూర్వా మేఖలం గట్టెఁ, గే
లను గోదండముఁ బ్లక్షదండ జపమాలా కంకణంబుల్ గొనెన్. 20.

భగవతీ! అరుంధతీ! వీఁ డెచ్చటివాఁడో యూహింతువా?

అరుం—మే మిప్పుడే గదా వచ్చితిమి!

జన—ఆర్య! గృష్టీ! నాకు మిగుల వేడుక పొడముచున్నది. కాన వాల్మీకి భగవానునే చేరి యడుగుము. "ఎవ్వరో వృద్ధులు నిన్నుఁ జూడఁ గోరుచుండి" రని యీ బాలకున కెఱింగింపుము.

కంచు—మీ రాన తిచ్చినట్లే. (నిష్క్రమించును.)

కౌస—ఇట్లాహూతుఁడై యరుదెంచు నందువా?

అరుం—ఇట్టి నిర్మాణంబునకు సౌశీల్యంబు భేదించునా?

కౌస—ఎట్లు? వినయాకర్ణిత గృష్టి వచనుండై మునికుమారుల విడిచి యీ డింభకుం డిట్లెదురు వచ్చుచుండెనే?

జన—(చాలతడవు పరికించి) ఓహో! యేమిది?

చ. వినయ శిశుత్వ సౌగ్ధ్య పరివేష్టిత పేశల మైన వీని యా
నన మహిమంబు నేర్పరులు గాని యెఱుంగరు మూర్ఖులేని, నా
మనము ప్రమూఢ మైన బలమండితుఁ డై హరియించె వీఁడు, హె
చ్చున నినుమున్ గ్రహించు లఘుచుంబక ఖండము పోల్కి నెంతయున్. 21.

లవుఁడు—(ప్రవేశించి తనలో) పూజ్యులైనను నామ క్రమాన్వయంబులం దెలియక నాయంత నెట్లు నమస్కరింపఁ గలను? (యోజించి) ఇదిమాత్ర మవిరుద్ధ పద్ధతి యని వృద్ధుల వలన వినంబడెడి. (వినయముతోఁ జేరి ప్రకాశముగా) ఇదే! మీకు లవుని శిరఃప్రణామశైలి.

అరుం—జన—కల్యాణనిధీ! ఆయుష్మంతుఁడవు గమ్ము.

కౌస—వత్సా! దీర్ఘాయువవుగమ్ము.

---

మాంజిష్ఠమయ=పసుపురంగుతోఁగూడిన, అంతరీయమును=ఉత్తరీయమును, మూర్వా మేఖల=మూర్వయను గడ్డితోఁజేయఁబడిన మొలనూలు, ప్లక్షదండము=రావిపుల్ల, ఆహూతుఁడై=పిలువఁబడినవాఁడై, పరివేష్టిత=ఆవరింపఁబడుటచేత, పేశల=మృదువయిన. ప్రమూఢమైనన్=ఎక్కువమూర్ఛలోనున్నను, లఘుచుంబకఖండము=తేలికయగు సూదంటురాయి.

అరుం—తనయా ! రమ్ము. (లవుని దొడపై నిడుకొని స్వగతము) సంతోషము ! చిర కాలమునకు నా యుత్సంగమే కాదు మనోరథంబుఁ గూడ సంపూర్ణమైనది.

కౌస—పుత్రా! యిటుగూడరమ్ము. (కౌఁగిలించుకొని స్వగతము) ఓహో! దరవికస్వ రేందీవర మాలికా శ్యామలోజ్జ్వలంబైన దేహబంధంబునఁనే కాక, కబళిత కమల కింజల్క కాదంబ మధుర గళ రవోదార దీర్ఘస్వరంబునను రామభద్రు ననుక రించి యుండెఁ. వికచారవింద గర్భ మంజులంబైన యీ కుమారుని తనుస్పర్శం బు నట్టిదియే. (ప్రకాశము) వత్సా ! ఆయుష్మంతుఁడా ! నీ ముఖచంద్రు నాలో కింతును. (చుబుకము నెత్తి కన్నీళ్లతో సాభిప్రాయముగానవధరించి) రాజర్షీ ! చూడవేమి ? నిపుణముగఁ బరికింప నితని ముఖము వత్స యగు జానకి ముఖచం ద్రునితో సరిపోలు చున్నదే ?

జన—చూచుచుంటి నమ్మా చూచుచుంటిని.

కౌస—ఓహో ! నా చిత్త మున్మత్త మైనదియుం బోలె నెద్దియో చింతించుచు మిగులఁ జంచలించుచున్నది.

జన—(స్వగతం)

ఉ. ధరణిజ రూపమున్ రఘువతంసుని కాంతియు నికుమారు నన్
విరివిగఁ బూర్ణభంగిఁ బ్రతిబింబిత మైనటులం దరర్చ, వా
క్సురతి, నిసర్గ నమ్రతయు, నిర్మల సత్త్వము సైత మల్లదే !
యరిమురి నాదు చిత్త మడియాసలఁ బాఱుచు నుండె హా ! విధీ! 22

కౌస—వత్సా ! కలదా నీకుఁ దల్లి ? తలఁపోయుదువా తండ్రిని ?

లవు—లేదు.—

కౌస—అట్లయిన నీ వెవ్వరివాఁడవు ?

లవు—భగవానుఁడగు వాల్మీకి సంబంధుఁడను.

కౌస—ఓవత్సా ! వక్తవ్యముఁ జెప్పుము.

లవు—ఇంతవఱకే యెఱుంగుదును.

(తెఱలో) ఓహో ! సైనికులారా ! "ఆశ్రమప్రాంత భూమి నెవ్వండు నా క్రమింపరా" దని యీ కుమార చంద్రకేతుఁ డాన వెట్టుచున్నాఁడు.

---

దర=యించుక, వికస్వర=వికసించిన, ఇందీవర=నల్లకలువవలె, శ్యామల=నలుపుచేత, ఉజ్జ్వలంబై=ప్రకాశించునదియై, కబళిత=తినఁబడిన, పద్మకేసరములు గల, కాదంబ=కలహంసలయొక్క, మధురమైన, చుబుకము=గడ్డము.

అరుం—జన—ఓహో ! యజ్ఞాశ్వరక్షణార్థమై యరుదెంచిన చంద్రకేతు కుమారుఁ డిపుడు చూడఁదగినవాఁడు. ఆహా ! సుదినము.

కౌస—వత్సయగు లక్ష్మణుని పుత్త్రుఁ డాజ్ఞాపించు చుండె నని సుధాబిందు సుంద రంబు లగు నక్షరంబులు వినవచ్చుచున్నవి.

లవు—ఆర్యా ! ఈ చంద్రకేతుఁ డన నెవ్వరు ?

జన—దశరథ పుత్త్రు లగు రామ లక్ష్మణుల నెఱుంగుదువా ?

లవు—వారే రామాయణ కథానాయకులు.

జన—అట్లయిన నెట్లెఱుంగవు ? ఆలక్ష్మణుని కుమారుఁడే యీ చంద్రకేతుఁడు.

లవు—ఊర్మిళానందనుఁడా ! అట్లయిన జనకరాజర్షి దౌహిత్రుఁడు.

అరుం—'నవ్వి' కుమారుండు కథా ప్రపంచంబు వెల్లడించె.

జన—నీ విట్టి కథా కోవిదుండ వేని చెప్ప మడుగుచుంటిమి. ఆదశరథాత్మజుల కే పేరిటి నందను లేభార్యలందు జన్మించిరి ?

లవు—ఈ కథా విభాగము మేముగాని యొరులుగాని వినియుండలేదు.

జన—ఏమి ? కవి రచింపలేదా ?

లవు—రచించె. వెల్లడించలేదు. అందలిదే యేకదేశమును సందర్భాంతరమున సరస రూపకంబుగా నిర్మించి స్వహస్త లిఖిత మగు నాగ్రంథమును వాల్మీకిభగవానుఁడు తౌర్యత్రిక సూత్రి కర్త యగు భరతమునికిఁ బంపె.

జన—ఎందులకు ?

లవు—ఆ మ్మహాత్ముఁడు దాని నచ్చరలచే నభినయింపఁ జేయు నని.

జన—ఇది యెల్ల మాకు సాకూతముగాఁ గానఁబడుచున్నది.

లవు—వాల్మీకి భగవానునకు దీనియందు మిగుల నాదరము. కొందఱ శిష్యులచే నీ పొత్తమును భరతాశ్రమంబున కనిపె. వారికి సహాయుఁడై ప్రమాద నివారణార్థ ముగా ధనుర్ధారి యగు మా సోదరుం డంపఁ బడియె.

కౌస—నీకు సోదరుఁడుఁ గూడఁ గలఁడా ?

లవు—కలఁడు, ఆర్యుఁడగు కుశుఁడు.

కౌస—పెద్దవాఁడనుచుంటివే ?

---

తౌర్యత్రికము = నృత్తము, వాద్యము, గీతము, సాకూతము = అభిప్రాయగర్భితమయిన.

